# శ్రీగోవిందద్వాదశీదిగ్విజయము

ఇది

పెద్దాపురం కాపురస్థులు కాళ్లకూరి హనుమచ్ఛాస్త్రి
కవిగారిచే రచింపబడినది.

---

సకల విద్వద్బృందముచే పరిశోధింపబడి అంబాజీ
పేట కాపురస్థులగు మ॥ రా॥ శ్రీ॥ అద్దేపల్లి
శేషయ్యాగారి ద్రవ్యసహాయములో,

కాకినాడ

కొలను రామకృష్ణయ్యాగారి మనోరంజనీ ముద్రాయంత్రము
నందచ్చొత్తించబడి గణకవీరాభట్టాచార్యవర్య
శిష్యబృందంబుచే జగదుపకారంబగునటుల
ప్రకటింపంబడినది.

మొదటికూర్పు ప్రతులు 500 మాత్రం.

1915 సం॥

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 13 | వా రెలధ | వా రేటవ |
| 11 | 15 | స్తుదుర్గభః | స్తుదుర్లభ |
| 11 | 15 | ర్వల్లభ | ద్వల్లభ |
| 11 | 15 | రాజన | రాజన్య |
| 12 | 4 | సె గిర | స్థై గిర |
| 12 | 11 | సంయుస్తు | సంయుక్త |
| 13 | 9 | వృష్యత్కా | ఫృష్యత్కా |
| 13 | 12 | ప్రవ్యత్క | వృష్యత్కా |
| .. | 12 | ద్వాదశీ | ద్వాదశీ |
| 13 | 15 | ద్వాదసీ | ద్వాదశీ |
| 14 | 10 | సముగ్ఫ్రు | సమ్యగ్ఫ్రు |
| 15 | 4 | వైవిత్ర | నైమిత్త |
| 16 | 5 | భిర | భీర |
| 16 | 5 | సకల పంతిత | సకల గణిత |
| 16 | 14 | మధ్యస్తానం | మధ్యస్థానం |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 23 | 8 | పెద్దు | పెద్ద |
| 23 | 14 | శ్లోక | శ్లోక |
| 25 | 13 | మహాముష్మి | మూముష్మి |
| 27 | 2 | పత్రికజడివి | పత్రికం జదివి |
| 28 | 7 | నును | నున్న |
| 28 | 8 | నస్తు | నస్తు |
| 29 | 6 | దూరము | దూరము |
| 31 | 7 | వంతా | వాంతా |
| 31 | 10-11 | చన్నా-మార్ద | చన్నా-మార్గన |
| 31 | 13 | సిద్ధాంతి | సిద్ధాంత |
| 32 | 4 | జగధీ | జగదధీ |
| 32 | 8 | పది | ఎది |
| 32 | 8 | మహా | మహి |
| 32 | 9 | బేవి | బెది |
| 32 | 10 | బేవి | బెది |

చినను బోధపడక యేకపోతు గాంభీర్యమునుఁ జూప
నెంచిరో? లేక విమర్శింప నవసరము లేదని తలంచిరో?
కాని మెట్టుకి నీ దుర్లభ్య మహాపుణ్యకాలమును గంగ
లోఁగల్పి పాపమును మూటగట్టుకొనిరి. తక్కినవారు
పప్పులో కాలువైచినను శ్రీ॥ మ॥ రా॥ రా॥ శ్రీరాజా
అంకితం వెంకటజగ్గారావు బహద్దరువారి సంస్థానపం
డితులగు శ్రీమాన్ యచ్చాన్ తిరుమలై కాండూరి
తాండవకృష్ణమాచార్య దైవజ్ఞ చక్రవర్తులనలుమి
వహ కన్యాదానమున్నట్లు ప్రసిద్ధముగానున్న గురు
యోగమును దెలిసికొనక, గురుమాత్రయోగ వికల
ముగాఁ దమ పంచాంగమందు స్ఫుటముగా వ్రాసిరి.
జగత్ప్రసిద్ధ దైవజ్ఞసోదర సింహంబులగు శ్రీమత్పిడ
ప ర్తివారుగూడ లోకముమీఁద సీతకన్ను వైచిరి. "మ
హాగజాగ పలాయంతే నక్షత్రానాంతుకా గతిః" యు
న్నట్లు తక్కిన పంచాంగముల సంగతియేల? అహా?
చూచితిరా? కాలమహిమ? మెట్లు మారిపోయిన

దో! లోకోపకారార్థమై పుట్టిన సాహిత్యగణితవ్యూహా
ములగు సిద్ధాంతులే మంచిచెడ్డలం జెప్పకపోయినఁ బా
మరలోకమునకు గతియేమి? ముందర మన రెండు వేల
పంచాంగముల నెవరికి కట్టిత్తుమా! యెప్పుడు సంవ
త్సరాదివచ్చునా! మామూళ్లెప్పుడు వసూలుచే
యుదుమా! యను హాందోళనంబుతో గణితములగు
ణించ పరిమైవతిథులు పంచాంగములలో నెక్కునా?
పంచాంగమన విట్టి పస్నాకిళముల దంభాచారమె కా
బోలు. చివరకు జ్యోతిషము మామూళ్ళకున్నా, కవి
త్వముకరినాకరు కట్టిపాసికొనుటకున్ను, చదువులు
కులభ్రష్టత్వమునకున్ను, హేతుభూతములైనవి. గత
జలసేతుబంధన మేటికిఁగాని ప్రస్తుతవిషయమై చర్చిం
తము. కట్టుగట్టి సిద్ధాంతిమండలం బెల్లనూరకొని, యీ
మహాపుణ్యకాలమునుఁ జెప్పకపోయినను దయామ
యుండగు నీశ్వరుండెవ్వరి హృదయంబులలోనైన జొ
రబడి చెప్పింపకుండునా? యను నమ్మకము నకుఁ దా

ర్యాణముగా సుప్రసిద్ధ బ్రహ్మశ్రీ బాల పూర్ణయ్యాదైవజ్ఞశిరోమణుల ప్రియశిష్యులై రాజవోలు తాలూకా మునిఖండమహాగ్రహారనివాసులై శ్రీరాణీ శ్రీమన్యం మహాలక్ష్మమ్మ రాజ్ఞీవారి సంస్థానపండితులై।

శ్లో॥ జ్యోతిశ్శాస్త్రమహోదధిం స్వధిషణామంథేన నిర్మంథ్యయో। తచ్ఛాస్త్రాంతమహావబోధ జనితానందామృతాస్వాదనాత్। వాసిష్ఠం సముదీపదీపయన్మహా జగద్దీపాఖ్యయా వ్యాఖ్యయా। యోవిప్రోబహుదక్షిణ క్రతురిహాముత్రామరాం స్తర్పయన్॥ శ్లో॥ జ్యోతిష్టోమాదికర్మప్రవణతమ మతిర్బ్రహ్మవిద్యాప్రపంచ। ప్రష్ట శ్రేష్ఠోక్తవిద్యామృతరసలహరీపానపీనాంతరంగః। సాహిత్యాద్యానవద్య లఘుతరసుమహాకావ్య చాతుర్యవిద్యా। పద్యాపాండిత్య శౌండో హరితమునికులే సోమయాజీచకాస్తి॥ అని కేవలము స్వభావోక్తిగా వర్ణింపబడిన విదితయశులగు బ్రహ్మశ్రీ శ్రీమచ్చిమలపాటి సూరదయ్యసిద్ధాంతి సోమయాజులవారు మనకు

దృష్టవశంబున దను ప్రమాదీచసంవత్సర పంచాంగ
మందు పరిపూర్ణముగా విమర్శించి, కేవల మాముష్టి
కఫలానుసారముఁ దృక్కంప, సుఖ్యేతర, ముఖ్యకల్ప,
అను కల్పములు మూఁడువిధములుగా నీమహాపుణ్యకా
లము కలుగునని పరనాలుగుమతముల ననుసరించి
శాస్త్రనిదర్శనముగా దైవజ్ఞులెల్లరుం దలయూచునట్లు
వ్రాసి, లోకుల నెల్లఁ దటంపజేసిరి. వీరిశిష్యులలోఁ బే
రూరుగ్రామ కాపురస్థులు బ్రహ్మశ్రీ సేమాని వెం
కటరమణయ్య సిద్ధాంతిగారు కల్పత్రయభేదముతో
వ్రాసిరి. తమతమ పంచాంగములలో వీరిట్లు ప్రకటిం
చి సుమారు 12 మాసములైననుఁ దక్షిణసిద్ధాంతు
లెవరొక్కని, యిట్లు వ్రాయుటకుఁ గారణంబేమియని
కాని, యసందర్భమనికాని, పరిపూర్ణయోగములు ప
ట్టలేదనికాని, విమర్శించుట తప్పనికాని, పరీక్షాముఖ
ములనైన వెల్లడింపకఁ జెల్లముగొట్టిన కాలవరెనూర
కుండి, విజ్ఞులయెదుట సొరకాయలఁగోయుచు నిట్లు

వ్రాసినవారిని కాకినాడంతా యేకమై ముక్కు నేలబెట్టి వ్రాయకవిడిచిపెట్టరు మా సమయమున రానిండని యుత్తరకుమారప్రజ్ఞలకు నన్నెన్నడు బ్రహ్మశ్రీ (బ్రహ్మానంద, సీతారామయ్యగార్లు మొదలగు సిద్ధాంతిరత్నములు, లోకమంతయు దీపించుచు సయులభ్యమహాపుణ్యకాలమును, రిత్తబుచ్చుటకుఁ దలఁచఁగా సర్వదయామయుండగు నీశ్వరుండూరకొనక బ్రహ్మశ్రీ చి॥ ము॥ సి॥ సో॥ నారిని శిష్యులతోఁ గార్యాంతరములఁగల్పించి పంచాంగముల ప్రింటుమూలముగాఁ గడచిననెల 26 వ తేదీని రప్పింపగా వ్రాసియిచ్చుటకున్న గడ్డం వెంకన్న బ్రదర్సు వారిచే నాహ్వానీయమాన్యులై వారి స్వగృహంబునను నిలచిరి. కొన్ని దినములతరువాతఁ గొందరు జ్యోతిష్కులు గూడా నిత్యటీకఁ దయసేయుట తటస్థించఁగా వీరిని వారిని నొకచో గూర్చుండబెట్టి గోవిందద్వాదశి విషయమై నేనడుగఁగాఁ గోడమీదఁ బిల్లివాటముగా సమాధానము చెప్ప బ్రహ్మ

శ్రీ బ్రహ్మానంద సిద్ధాంతిగారు మొదలగు సిద్ధాంతులచ్చే మ॥ సి॥ సో॥ గారు శృతి స్మృతిపురాణ నిదర్శనముగాఁ బెక్కుశ్లోకముల ధారాధరంబు వర్షించునట్లు, నరుములుచిమినభంగి శ్రావ్యముగా వినువారికెల్లరకు సమంజసమని తోఁప నుపన్యసింపగాఁ దగిన యుత్తరంబు లొసంగక « నెవ్వరూంవ్రాయలేదు. మేమూ వ్రాయలేద '' ని హాస్యాస్పదములగు జవాబులనిచ్చుచుఁ జల్లచల్లగా జారఁగా నీ సోమయాజిగారలభ్యమైన నీమహాపుణ్యకాలమును స్థిరపరచి, శ్రీమపతి, లోకులనెల్ల నీపుణ్యయోగంబునఁ దరింపఁజేయనెంచి, సభాముఖమున గాని, సిద్ధాంతీకరణము జరుగదని తలంచి, కాకినాడ సభాపతులగు, బ్రహ్మశ్రీ యనమండ్ర వావన్నగారు, బ్రహ్మశ్రీ బలిజపల్లి రామమూర్తిశాస్త్రిగారు, బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులుగారు, బ్రహ్మశ్రీ మైలవరపు వెంకటశాస్త్రిగారు, మున్నగు అష్టికమహా

జన శిరోమణుల చేతఁ గరిగి పదునాలుగుమతములలో నున్న ఋషిప్రోక్తములగు శ్లోకములను బోధించి, రొప్పించఁగా వారు సభకేయించుట కేర్పాటుసల్పి యాహ్వానపత్రికలఁ బురిమెల్లెడలఁ బంపించిరి. లోకోపకారార్థము శ్రమపడిన యీమహానుభావులకుఁ గూడ మహాఫలంబు సిద్ధించుఁగాత! తదనంతరంబు 7-3-14 తేదిని 5 గంటలు మొదలు 8 గంటలవరకు కాకినాడలో శ్రీవేణుగోపాలస్వామివారి యాలయములో సకల దైవజ్ఞవిశ్వజ్ఞన మహాసభ యొకటి జరిగెను. «వింశ విరశాస్త్రాలాస్థారాః కలావినసజ్జనాః" అని కాళిదాసోక్తికి నిదర్శనము కనఁబడియెను.

## శ్రీగోవిందబ్యావరీ దైవజ్ఞవిశ్వజ్ఞన మహాసభ.

---

5 గంటలు టంగున గొట్టినతోడనే, వెనువెంటనే యత కేవలము లోకోపకారార్థమగు చింతనతో, మొ

ట్టమొదట బ్రహ్మశ్రీ య॥ శా॥ గారున్ను బ్ర॥ శ్రీ॥
బ॥ రా॥ శా॥ గారున్ను కా॥ బ్ర॥ శా॥ గారున్ను
మున్నగు విద్వచ్ఛిరోమణులా సభాభవనం బలంకరిం
చిరి. వర్తమానమంపినతోడనే యాపబోయునఁ దీక్ష
ముదురైనట్లుగా వలంచి బ్రహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సా॥
గారధికసంతోష పరీతస్వాంతులై శాంతరసం బుట్టిప
డు నెమ్మోమున శ్రీశిస్మృతులు ఘోషింపుచుండగా,
గండబులకుండల తాండవంబులు చూపరనాకర్షింప,
నిరువంకలం బ్రియశిష్యులు బరాబరులు సేయుచు, గో
డురా, నాచార్యావతారంబు పగిది సమ్మహాసభకుం
జని సన్మానముతో నాదరింపంబడి, నక్షత్రగణంబున
విడియుచందురుభంగి సభ నలంకరించిరి. కించద్వైజ్ఞు
గుండెలలో పెద్ద బాపరాళ్లుపడినవి. నాస్థికులకు గు
డగుడశబ్దంబు లుద్భవించినవి. పత్రికలందినను, భీతిచే
సభకు రానిసిద్ధాంతులు రోడ్డుమీదఁ బచారులు సేయు

చు నివసువారన మూరుపేర్లు చెప్పుకొనుటకుఁ దొడం గిరి. అవిఁతయట్లుండగా, బ్రహ్మశ్రీ యు॥ బా॥ గారు, బ్రహ్మశ్రీ శా॥ బ్ర॥ గారు మొదలగువారు పూర్వ ము విజయనగర మహాసంస్థాన పండితులగు బ్రహ్మశ్రీ పిడపర్తి దక్షిణామూర్తి సాస్త్రిగారు రచించిన ధా త, యీశ్వర పంచాంగంబులఁదెప్పించి నైపథ్యశింపు లగు, శ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారినిట్లు ప్రశ్నించిరి.

" అయ్యా! పూర్వమీ దేశమంతయు నాచ రించిన ధాత సంవత్సరములో సిద్యాదశీమహాపుణ్య కాల మెట్లుసిద్ధించినది?

" ఫాల్గుణశుద్ధద్వాదశి, ఆదివారము, పుష్యన క్షత్రము, తిధ్యంతమందు శోభననామయోగము అతి విఘటియలు కలిగియుండుటచేతనున్ను, కుంభసూర్య భమధ్యగు లుంకుటచేతనున్ను, మీరడిగిన పుణ్యకాల ము తటస్థించినది."

యుతే । పుష్యర్క్షేణవివారేచయోగే శోభనసంజ్ఞి
తే । మహాపాతకసంఘఘ్నీ గోవిందద్వాదశీస్మృతా॥
౨॥ గారుడపురాణే। కుంభస్థేభాస్కరే రాజన్మకర
సంగిరన్యపి । ద్వాదశీ శుక్లపక్షస్య పుష్యర్క్షే జా
యతేయది । తిథిరేషామహాపుణ్యా బ్రహ్మణాపకీర్తి
తా । గోవిందద్వాదశీనామ మహాపాతకనాశినీ॥ 3।
నిర్ణయసింధౌ॥ ఫాల్గునస్యామలేపక్షే కుంభస్థేదివినాథ
పే । జీవేధనుషవాముందే మకరేవివాసరే । పుష్యన
క్షత్రసంయుక్తే గోవిందద్వాదశీస్మృతా ॥౪॥ సిద్ధాన్త
సంగ్రహం ॥ కుంభేవా ఫాల్గునేసాస్యన్మకరస్థేశనైశ్చ
రే । జీవేధనుషిసంయుక్తే ద్వాదశీనక్షపక్షకే । పుష్య
ర్క్షే యదిసంపూర్తే భానువారణసంయుతే । గోవిం
దద్వాదశీనామ మహాపాతకనాశనీ। ౫। జగన్వల్లభే॥
వినాపుష్యర్క్షే యోగంవా గోవిందద్వాదశీశుభా ।
దద్యాద్దైవవిష్ణుసాయుజ్యం త్వత్ర శ్రీపురుషోత్తమ ॥
కాలచంద్రికాయాః॥ ఫాల్గునస్యసితేపక్షే కుంభస్థేది

వసాధిపే । జీవేశ్వనుషివామందె మకరే రవివాసరే ।
పుష్యర్క్షేయుదిసంప్రాప్తా గోవిందద్వాదశీస్మృతా॥౬॥
కల్పనల్పాన్యముష్యైవమేవో క్తే॥ యథా॥ ఫాల్గునస్యా
మలెపక్షే కుంభస్థేదివసాధిపే । జీవేథనుషివామందె
మకరే రవివాసరే । పుష్యనక్షత్రసంయుక్తా గోవింద
ద్వాదశీస్మృతా॥ ౭॥ దైవజ్ఞవిలాసే కాపచంద్రికోక్త
వచనమువ్రా క్తం॥౮॥ భవిష్యోత్తరపురాణె ప్యేవము
క్తం॥౯॥ బ్రహ్మాండపురాణే॥ కుంభస్థేభాస్కరేచాపే
మకరేవాంగిరాశ్శని॥ ద్వాదశీశుక్లపక్షస్య పుష్యర్క్షే
జాయతేయది । గోవిందద్వాదశీనామ మహాపాతకనా
శనీ॥౧౦॥ బ్రహ్మపురాణె॥ కుంభస్థేభాస్కరే రాజన్మ
కరస్థేశనైశ్చరె । ద్వాదశీశుక్లపక్షస్య పుష్యర్క్షేయది
జాయతే । తిధిరేషా మహాపుణ్యా బ్రహ్మణాపకీర్తితా॥
గోవిందద్వాదశీనామ మహాపాతకనాశనీ॥ ౧౧॥ వ్రత
మహార్ణవే॥ పుష్యర్క్షేద్వాదశీయుక్తా కుంభస్థేచది
వాకరే । మహాపుణ్యతమాకాలెపూజ్యా బ్రహ్మాది

శ్వరాః । గోవిందద్వాదశీం ప్రాప్య యేనోపోషితం నాచర
తతే । అత్యంతదుఃఖదో ఘోరా సంసారేషు పతంతి
తే॥ ౧౨॥ స్కాందపురాణే॥ ఫాల్గునస్యసితేపక్షే కుంభ
స్థేచదివాకరే । పుష్యర్క్షేణ యదిసంయుక్తా గోవింద
ద్వాదశీస్మృతా॥ ౧౩॥ విష్ణుధర్మోత్తరే॥ ఫాల్గునామ
లపక్షస్య పుష్యర్క్షేణ ద్వాదశీయది । గోవిందద్వాదశీ
నామ మహాపాతకనాశనీ॥ ౧౪॥ బ్రహ్మపురాణే॥ గో
విందద్వాదశీనామ మహాపాతకనాశనీ । తస్యాం మ
హోదధిస్నానం దృష్ట్వాతుపురుషోత్తమం । యత్ఫలం
ప్రాప్యతేనమర్త్యఃఋషిస్వావహితోవ్రత । శతసంవత్స
రం గంగాస్నానపుణ్యమవాప్నుయాదితి॥
అని ఋషిప్రోక్త శ్లోకముల వలనను ప్రమా
ణములుం గనపరుచుచుండు రవకందాయములో నుట్టి
వచ్చినట్లు చెప్పుచుండిరో ? వయ్యాకరణులగు బ్రహ్మ
శ్రీ కేరి పేరయ్యశాస్త్రిగారున్ను, శతావధాని బ్ర
హ్మశ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారున్ను విచ్చేసి, వ

రుగుచున్న ప్రసంగంబులవిని « మీరుచెప్పిన రాత్రి గల్గిన పుణ్యకాలమునకు విశేషయోగములున్నను రాత్రి సముద్రస్నానముఁ జేయవచ్చునా ?

« నైమిత్తికములగు చంద్రగ్రహణాది పర్వములయందు విధిగా నిర్ణయింపబడిన సముద్రస్నానమెటుల నాచరింపుచుండిరో ? యటువలెనె నైమిత్తికమగు నీయలభ్యయోగ మహాపుణ్యకాలమునకుం గూడ సముద్రస్నానముఁ జేయుటకు సందేహమేముండును ? అని యనేక ప్రమాణములతోఁ గూడినఁ బ్రత్యుత్తరంబులిచ్చినతరువాత నొకరి మొగంబులొకరు చూచుకొనుచుఁ గొందరు పండితులు తలలు వంచిరి. కొందరుపలుకే బంగారమయ్యెను. కొందరిమాట వరాలమూటయయ్యెను. కొందరు నాస్తికులు కూడదనియు కొందరాస్తికులు నిజమేయనియు, వితండవాదములకుం దొడంగిరి. వాదంబులు ముదిరినవి. చినుకు చినుకు గాలివానయయ్యెను. రోషంబులువచ్చెను. మొ

గములు జేపురించుటకు సిద్ధమైనవి సభయంతయు నానాగర్గోలుగా నొకరి మాటలొకరికి వినబడకుండ నిరాధార తర్కములకులోనై కేకలు పెడబొబ్బలు పెల్లుమీరుచుండు మంచితరుణంబునందు, శ్లో॥ అక్షతగంభీరవచ। పరిపూర్ణం । సకలపండిత పరిపూర్ణం విడపతిః బాలపూర్ణం । కలహైర్జ్యోతిషైః కలా సుపరిపూర్ణం॥ అని తమ సంపూర్ణగురుభక్తి తేటపడ, శిష్యులగు బ్రహ్మశ్రీ చీ। మ। సి॥ సా॥ గారు వర్ణించిన స్వభావోక్తికిం దార్కాణముగా సాక్షాచ్ఛ్రీగోవిందానియవతారమో? లేక వేదవ్యాసుని పరరూపమో నానుప్రసిద్ధులగు బ్రహ్మశ్రీ పిడపర్తి చినపూర్ణయ్య దైవజ్ఞచక్రవర్తిః కాకతాళీయంబుగ నక్కటికేగుదెంచినతోడనే సభాకల్లోల మణంగెను. సభికులందరు వారిని, సభామధ్యస్థానంబునకుం దెచ్చి బహువిధములఁ గౌరవించి, పెక్కురీతుల స్తుతించుచు నిట్లడిగిరి.

« మహాత్మా! అలభ్యయోగము నీకోవింక

ద్వాదశీ పుణ్యకాలమును మీరు పూర్తిగా నంగీక
రించక విడిచిపెట్టినట్లున్నది. తమ శిష్యులగు చి॥ మ॥
సి॥ సా॥ గారు ఋషిప్రోక్తశ్లోకములచే సిద్ధాంతీకరిం
చి జానెడుమూరెడు పొడుగున బత్రికం బ్రచురిం
చిరి. కారణము వినగోరుచున్నాము. తెలుపఁ బ్రార్థి
తులు " అని యడుగఁగా అంతట దైవజ్ఞసింహంబు
తన ప్రజ్ఞాపరాక్రమంబునకుఁ గించజ్ఞమృగంబులెల్ల
భీతినొందఁగా బాహుస్ఫాలనం బొనర్చుచు, నాలయం
బెల్ల నిజగంభీర వాగ్గర్జావంబులఁ బ్రతిధ్వనులీయ,
నిట్లని ప్రత్యుత్తరమిచ్చె.

" పూర్వమునుండి బహుగ్రంథంబులఁ బరిశీలిం
చి, శార్వరి, శుభకృత్, శోభకృద్వత్సరంబులలో వ
చ్చిన గోవిందద్వాదశిని యుక్తియుక్తముగా నాపం
చాంగంబున వ్రాసియున్నాను. కాని పామరలోకము
గుటచే నెవ్వరు నాచరింపని హేతువుచేత నిప్పుడీ న్యా
యప్రసిద్ధ పుణ్యకాలము తటస్థించినను లోకమాచ

తిగా సిద్ధించలేదని కారణముచేతనే, వారి పంచాంగమందు వ్రాసి యుండనట్లు స్పష్టమగుటచే నీయోగము సిద్ధింపలేదనియె నాయాభిప్రాయమను వీకులాట పంచాంగమునువిప్పగా బ్రహ్మశ్రీ కా॥ బ్రః శాస్త్రిగారు లేచి వారు స్వయముగా సభకు విచ్చేసి, పంచాంగమందు వ్రాయకపోవుటకు గారణముఁ దెలియపరుచుచు నీయోగము సిద్ధించినదని వారిదివరలో దెల్పినప్పుడు మనము వేరె యభిప్రాయపడుట మంచిది కాదని శెలవిచ్చి కూర్చొనిరి. అపైని బ్రహ్మశ్రీ దీః తిః శాస్త్రిగారు లేచి కొన్ని యుక్తులు బ్రహ్మశ్రీ కా॥ బ్రః శాస్త్రిగారు లేచి కొన్నియుక్తులను బన్నుకొనఁ గడఁపులఁ జేతబట్టుకుని సర్వ సభ్యులందరు పరస్పరవాక్య సమ్మోహాస్త్రంబుల హైమనుపజేయుచుఁ జమత్కారోక్తి, పరిహాసోక్తి, బహూళోక్తి, యత్యుక్తి,ఛలోక్తి, యుం దేటఁబడ నాపండితతూము లిద్దరుఁ గొంతవరకు వినోదక్రీడలు సల్పిరి. తద్దిన ప్రసంగంబు

ల వర్ణించుటకు నాకలంబునకే గాక దేనికైన నలవి
కాదనియె నా తాత్పర్యము. ఇట్టి పండిత శార్దూలంబు
లు పరస్పర భీకరాట్టహాసంబులతో బొబ్బరిల్ల నాల
యంబె గాకఁ బట్టణంబంతయుఁ ఘూర్ణిల్లె. సభయందు
న్న నూతన సిద్ధాంతులట్టిపుకు నట్టడికి, కుత్తుకలలోఁ
బచ్చి వెలగకాయ లడ్డపడిన ట్లేమియుం జెప్ప నేరకఁ జి
త్రముగాఁ జిత్రములై చిత్రములరీతి నుండిరి. సభకు
రాక నక్కడక్కడ నిలచి తొంగితొంగిచూచు సిద్ధాం
తులు దాంతరయంబున నాటిపడిన వాక్య శరాఘాతం
బుల నేమిఁ గొంపమునుఁగునోయని పిక్కబలము
జూపెట్టిరి. తరువాత బ్రహ్మశ్రీ కా॥ బ్ర॥ శాస్త్రి
గారు సభవారి వైపున లేచి " పెద్దల విషయములో
మనమేవిధమైన యపచారమునుఁ జేయఁగూడదనియు
బ్రహ్మశ్రీ పి॥ చి॥ పు॥ సిద్ధాంతిగారు సభామధ్యం
బున లేచి యీపుణ్యకాలము యదార్థముగా సిద్ధించి

వదనియుఁ బెక్కు సారుల చెప్పినను బెడఁ చెవింబెట్టి స్వ
స్వరమిట్లు వాదమాడికొనుచుఁ గాలము రిత్తబుచ్చు
ట గూడదని తెలివియుగా బ్రహ్మశ్రీ ది॥ తి॥ శాస్త్రి
గారు లేచి యిదివరలో వారు పంచాంగమందు వ్రా
యక పోవుటచేతను యీసభయం దివ్వకున్నదని చె
ప్పుటచేతను భయమంది చెప్పినట్లుగాఁ దలంచి యట్లం
టినిఁగాని, వారు యదార్ధహృదయముతో నీపుణ్యకా
లము కలదని చెప్పినచో నాకును సమ్మతమెయనుట
విని బ్రహ్మశ్రీ పి॥ చి॥ పూ॥ సిద్ధాంతిచక్రవర్తి లేచి
సభ యంతయు, నెవ్వెరపడి తెప్పవాల్పక, నిశ్శబ్దము
గా దన్నవలోకించుచుండ, నిరంకుశ, నిర్భయ, నిరా
ఘాట, వచః పాటవంబు తేటపడ మాద్దులు మూటగ
ట్టినట్లు గంభీరముగా " నాకేవిధమైన భయమును లే
దు. సోమవార ముదయమందే పుణ్యకాలముఁ జేసికొ
నుటకు యదార్ధముగా నా సమ్మతిమేయని కంఠోక్తి
గా తెలవిచ్చిరి" అప్పుడు సభ యంతయుఁ గరతాళ

శ్వాసులతో భోయ కలుగఁగాఁ జూచి యూరుఁగొనక
బ్రహ్మశ్రీ ది॥ తి॥ శాస్త్రిగారు లేచి ‹‹ ఏఋషిసమ్మత
మై యీయోగము సిద్ధించినదో లేక పూర్తిగా లే
కుండా పోయినదో నిశ్చయపరచి ప్రమాణములు
చూపింపుడని బ్రహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారిని ప్ర
శ్నించిరి. బ్రహ్మశ్రీ పుల్యమా మహేశ్వరశాస్త్రి
గారిచేఁ బరిష్కరింపఁబడిన పత్రికలఁ బదిమందియుఁ
బుచ్చుకొనిరి. బ్రహ్మశ్రీ పెద్ద దక్షిణామూర్తి శా
స్త్రులుగారు రచించిన పూర్వపు గోవిందద్వాదశీవిష
యమైన ధర్మశాస్త్రముగల ఈశ్వరసంవత్సర పంచాం
గమును బ్రహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారు స్వీకరించి
యందు ప్రమాణవచనములనుఁ జూపించుచు గారు
డాది మహాపురాణములయందుఁ జెప్పియుండుటంబట్టి
యీయోగము తటస్థించినదని ఋషిప్రోక్త శ్లోకవర్గం
బు గురిపింపగా సభ్యులందరేకగ్రీవముగా నంగీకరించి
యీ గోవిందద్వాదశీ పుణ్యకాలము సిద్ధించినదని సి

ద్ధాంతీకరించిరి. లోకమునకు దెలియగలందులకై యీ క్రింది తీర్మానపత్రికనుఁ బ్రకటించిరి.

## శ్రీ గోవింద ద్వాదశీ తీర్మానము.

" నేటిసాయంకాలము జరిగిన సభలో వైదిక శిరోమణులగు బ్రహ్మశ్రీ పిసపాటి చిదంబరయ్య సిద్ధాంతిగారు బ్రహ్మశ్రీ చిలుకపాటి మఠదయ్యసిద్ధాంతి సోమయాజిగారు, బ్రహ్మశ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధానిగారు, బ్రహ్మశ్రీ పేరి పేరయ్యశాస్త్రిగారు, మున్నగు విద్వజ్జన మహాజనులీ ఫాల్గున శు ౧౨ సోమవాసరమున గరుడపురాణాది గ్రంధరీతిచే గోవింద ద్వాదశీ మహాపుణ్యకాలమును సలభ్యయోగము లిట స్థించినదని సిద్ధాంతికరించిరి. కాబట్టి యాస్తికమహాజనులందరు సోమవార ముదయమున గోవిందద్వాదశిఁ

జేసికొందురుగాక.

ఇట్లు సభాపతులు

| | |
|---|---|
| కాకినాడ | మైలవరపు వెంకటశాస్త్రి అనియున్నది |
| | యనమండ్రి బాపన్న అనియున్నది |
| 27-3-14 | బలిజపల్లి రామమూర్తి శాస్త్రి అనియున్నది |
| | కాశీభట్ల బ్రహ్మయ్య అనియున్నది. |

తదనంతరంబు బ్రహ్మశ్రీ పి॥ చి॥ పూ॥ సిద్ధాంతిగారు మొదలగువారు సభ వెడలిపోయిరి. సభ ముగించి వచ్చునపుడు మహాపుణ్యమూర్తులగు బ్రహ్మశ్రీ చి॥ మ॥ సి॥ సో॥ గారతిమోదముతో వినయపూర్వకముగా నిట్లు శెలవిచ్చిరి. "ఆస్తికమహాజనులారా! నేను బహుశ్రమపడి యనేక గ్రంథములఁ బరిశీలించి కేవల మాముష్మికాపేక్షతో నీయలభ్య మహాపుణ్యకాలమును నా పంచాంగమందు చేర్పించి వ్రాసినాదులకు మీయావన్మంది విద్వన్మహాజనులందరీపట్నంబున సభచేసి యీ పుణ్యకాలమును స్థిరపరచి మహామ

ము లందరచే నాచరింపఁ జేయుచున్న నీ విద్వద్గ్రగ
ణ్యుల కెల్ల ననేక వందనంబు లర్పించుచున్నానని మృ
దుమధురోక్తులతో ముపన్యసింపగా బ్రహ్మశ్రీ యు॥
శా॥ గారు లేచి « సిద్ధాంతులు పేక్షచే నుపేక్షింపబడి
న నీ యలభ్య గోవింద ద్వాదశీ పుణ్యకాలమును పం
చాంగమునందు వ్రాసి యస్మదాదులందరికే గాక లో
కమున కెల్ల నీ మహాపుణ్యమును సంభవింపఁజేసినవారగు
టవల్లఁ దమ కనేక వందనంబు లర్పించుచున్నానని చె
ప్పిరి. ఒకపెట్టున సభవారందరుఁ దమ వాక్ప్రసూనం
బుల శ్రీమచ్చి॥ మ॥ సి॥ సా॥ గారినిఁ బూజించి సభ
ముగించిరి. బ్రహ్మశ్రీ బ॥ గా॥ శాస్త్రిగారు మున్నగు
భక్తశిరోమణు లత్యంతానందముతో భజగోవిందముల
బాడుచు గోవిందభజన సేయుచుఁ దమయిండ్లకు విచ్చే
సిరి. మరునాఁడు శ్రీ చి॥ మ॥ సి॥ సా॥ గారి ప్రఖ్యాతి
యు వారి సంపూర్ణసిద్ధాంతమును పరిపూర్ణజయమును
కాకినాడపట్ను మాబాలగోపాలముగాఁ దెలియుటఁ

తోడను గ్రామసభాపతులు పురోహితులులోనగు బ్రా
హ్మణసంఘంబు పురజనులకు జయపత్రిక జదివి యి
చ్చుచు పుణ్యకాలమహిమను జెప్పుచు యుండగను
వ్రాయనటువంటి యీమహాపుణ్యకాలమును స్థిరపరచి
న విద్వాంసులును దైవజ్ఞశిరోమణులునగు శ్రీపుచ్చి॥
మా॥ సి॥ సా॥ గారీయనెయానుచు వారి ననేకరీతుల స్తుతిం
చుచు బాజారుమధ్యనుండి పోవుచుండ పట్టణంబంత
యుం జిన్న పూం దెనెపట్టున కీగలుముసిరినట్లుం జుట్టు
కొని, యత్యద్భుతముగా నీ గోవిందద్వాదశీ మహాత్మ్య
మును వినంజొచ్చిరి. యీగుంపులనుం జూచి పోలీసు
వా రనేకులు ప్రత్యక్షమై సంఘములిట్లు చేరుట చట్ట
మునకు విరుద్ధమని చెప్పుచుండగా దోవలో ననేకసం
ఘము లేర్పడినవి. కాని మాన్పించుటకు పోలీసువారి
కసాధ్యమైనది. ఆదివారము సాయంత్రము 5 గంటల
వరకు పురజనులంద రమ్మహాత్ముల వెనువక వారి వా
గ్వాగురలం జిక్కనపి వెనువెంట బోయిపోయి శెల

వులు గైకొని మరలిరి. కొందరు భక్తులమ్మహాత్ములు 5 గంటలు మొదలుకొని 7 గంటలవరకు 9 యోగములుఁ గలసినవనియు నిప్పటినుండియు నాపుణ్యకాలము విశేషించి కలదనియు నొక్కి నక్కాణించుటచేత మనమిప్పుడే సముద్రస్నానము జేయవలయునని యూరాత్రియె బోయిరి. పల్లములో మూడువంతులు గట్టిప్ర బంక్షమీదను రెండు వంతులు కాలినడకతోను ఒకవంతు గోవింద భజనలతోనున్ను తులాస్నానంగను మునకున్ను సీకుష్టమూపీసు రేవునకున్ను బోయిరి. పౌరోహితులున్ను బ్రాహ్మణులున్నుఁ దలవని తలంపుగా నా ముంగండ పుణ్యాత్ముఁడీ సూపకముగా మనల రక్షించినాడని మొత్తుకొనుచు సంవత్సరమునకుం జాలిన గోభూధన కనక వస్తువాహన · దానంబులం గైకొని విధియుక్తముగా వచ్చినవారిం గృతకృత్యులం జేసిరి. ఆరేయి గోవింద భజనలతో భల్లువఁదెల్లవారి ప్రొద్దు పొటుస్కు-నఁ బొడిచే సరికి ననేక వేలమంది వివిధమైన

వేడుకలతో, నూరేగింపు టుత్సవములతో ననేక వాహనంబులతో ననేకరీతుల సీకష్టమూపీసు రేవునకున్ను జొల్లంగి రేవునకున్నుఁ బోయి మహాసంకల్ప పూర్వకముగా, స్నానంబు లాచరించువారును, నౌకాయాత్రల జేయువారును, నా యాత్రలవలనఁ ఫలము లేదని కాలినడకఁ బోవువారున్ను, దూరముగా సముద్రములోనికి మొలబంటివరకుఁ గొందరు పోయిన తోడనే కొంతవరకు శాశ్వతమైనదని రాధాకృష్ణ ప్రతిమలను గోవింద విగ్రహములనుఁ గల్పితముగ నారాధించు వారున్ను, దుర్లభ యోగంబగు నీ మహాపుణ్యకాలంబునందుఁ దీర్థవిధుల జేయకఁ దప్పదని తీర్థశ్రాద్ధంబులు జేయువారును, యీర్ష్యచేతనున్ను, శాము వ్రాయలేదను హేతువచేతనున్ను, స్నానంబునకు రాని నాస్తికులకున్ను, సభలోనికి రాకఁ జాటుచాటున నీనున గూసికొనుచుఁ దుషాణఖండనంబునేయు ప్రతి పక్షులగు నఖ్య సక్షులకు ద్వాదశాష్టక పారాయణంబు సేయు

వాయను నై, మహాసంతోషంబున బ్రిహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారి సత్యాశ్చర్యంబులో పాతాద్గోవిందుని యవతారంబని దలంచి జోహారు లిడువారునై యాత్రికులు ఎచ్చటఁ జూచినఁ దామేయై సేల యీనిసట్లుండి. అప్పుడు బ్రిహ్మశ్రీ య॥ బా॥ గారు సర్వజనుల యెదుట షట్ఛాస్త్ర మహావిద్వాంసులగు మిక్కిలి దుర్గయ్య శాస్త్రులు గారున్ను, బ్రిహ్మశ్రీ యుప్పలూరి గంగాధరశాస్త్రుల గారున్ను, దగ్గర స్నాతులై నిలచి యుండగా నిట్టి మహాపుణ్యులచే నాచరింపబడిన నీ పుణ్యకాలమును స్థిరపరచిన బ్రిహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారికి సీ కాకినాడ పురజనుల తరపున ననేకవందనంబు లర్పించుచున్నాడ నను నప్పుడు బ్రిహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారు ముకుళిత కరకమలములతో గురువుగారితోఁ దులతూగి కంఠీరవంబు బోలిన కంఠమెత్తి శాంతోక్తులతో « నయ్యా ! ఈ గోవిందద్వాదశిం గూర్చి సభ చేయుఁటఁ మంచిచెడ్డలఁ బరిశీలించి, నా వాద మం

గీకరించి, తనకు నాకు జయపత్రిక నొసంగి, యనేక జనసమూహముల పాపసంఘము నశింపఁ జేసిన మీవం టి మహామహు లందరున్ను, « శ్లో॥ ఓం కారావర్త రమ్యాయ జరమలజలాసామ గంభీరఘోషా। ఋగ్వే దాథర్వకూలా క్రమపదపులినాన్యాయ శాస్త్రోత్తరం గా। అంగగ్రావావబద్ధాశత పథకుటిలా బ్రహ్మవి ద్యార్ణవంతా। విద్వద్వ్యాఘ్రావ్నవీయాం జనయతుదురి తం సర్వదా సర్వదానః॥ అనురీతిగ నాదురితక్షయము నకును మహాయశస్సునకుం గారణభూతులైన మీాక నేకవందనంబు లర్పించుచున్నానని మహావినయమున మూర్ధశైలితో, మాటకుఁ గోటివరాలీయఁ దగునట్లు చెప్పి స్నానాద్యనుష్టానములు దీర్చుకొని యందరిదగ్గ రను శెలవులం గైకొని దీవెనలంబడసి సిద్ధాంతినివాసు లును శిష్యులునగు బ్రహ్మశ్రీ కలగ వెంకటరామ సి ద్ధాంతిగారు మొదలగువారిచే బనకు విచ్చేసిరని తె లుపంజగిన పుణ్యంబునకు జాల సంతసించుచు, యున్న

హోమహవ్యు యపారబుద్ధి సామర్థ్యంబును దేనోళ్ళ
భాగమును, దీర్ఘాయు రారోగ్యాభివృద్ధి బలంబు లొన
గూర్చి, నిత్యపరిమదంబిడి కరుణారసంబునఁ గాపాడ
జగదీశుండగు నీశ్వరుని కనేకవిధంబుల మ్రొక్కుచుఁ
దరువాత యోగ్యతాపత్రిక నొసంగుచు నీగోవింద
ద్వాదశీ దిగ్విజయమును ముగించుచున్నాడను.

యో గ్య తా ప త్రి క .

చ॥ ఏది? సగుణంబు, నిర్గుణమహాననుఁ దింత్యము
రూపమద్భుతం । బేది? పరతత్వమాగమము సృష్టిల
యస్థితి నిత్యకారణం । బేది? నిర వద్యము జ్వాలము
హృన్నమట నిర్మలమాత్మ సృష్టితం । బది, పరిపూర్ణబ్రి
హ్మము మహాకుప్రసంబో్రిమత భక్తసంఘముఁన్॥ ౧

సీ॥ విజ్ఞులెల్లను మెచ్చ పిఠపురిఁ జినపూర్ణ సిద్ధాంతి
సింహులు చెలఁగియుపును । వారియనివారిలోఁ బ్రిధ
ములైతాము నాస్తికులౌదురంచును చిత్తమందు । భీ
తిల్లి సభకెటోవిచ్చేసి, యీ పుణ్యకాలఁబుకద్దని గార

వయున । నంగీకరించి విద్యానిధుల్యాగడంగఁ దమ
యూ స్తికవృబుద్ధి ధరణిమీాద॥

గీ॥ వెల్లసింగఁజేశి దైవజ్ఞ వితతులకు శి।
రోమణియటంచు బిరుదంది యూఢికెక్కు।
సారకుందార కుందడిండీరకీర్తి।
దనరె వినుతింప నాచంద్రతారకముగ॥ ౨

చ॥ ఘనుఁడా చీమలపాటి వంశజుఁడు సాంబాచ్యం
కరుండై భువిన్ । దనవిద్యావిభవంబు తేటవడఁగా,
దైవజ్ఞ సింహంబు లె, ల్లనుమెచ్చంగ శుభ్రీతిస్మృతుల్వా
దకీ సర్వత్న్యముగాఁ జేసెఁబోం । దిన సిద్ధాంతులతోడ
ద్వాదశికి నైసర్గిళిఁజర్చించి, వా । సి, నిరాఘాటము
గా జయంబుఁగొని శాసింగాంచి, పేరోలగం । బున
సంస్థాపనఁజేశి లోకములకుం బుణ్యంబుఁ గల్పించి, పా!
వన దైవజ్ఞ మృగేంద్రబట్ట గురులన్ బ్రఖ్యాతనామం
బుఁ బొం । దెను శ్రీకాకపురంబులో ఘనతగన్ సిద్ధాం
తి లోకంబునన్॥ 3

సీ॥ సభ కేగి జరిగిన శాస్త్రచర్చల నెల్ల విమువకఁ జె
వులార విన్నవాఁడ, వచ్చినసభ్యుతే పగి। ది వాదించి
తో కనుఱెప్పవాల్పకఁ గాంచినాఁడ, దక్కిన దైవజ్ఞత
తులెచ్చు టేకీలి నని చేయు। తేపికో యరసినాఁడ। నెవ్వ
రి సామర్థ్యమెట్టిదో నిష్పక్షపాత స్వబుద్ధితో వ్రాసి
నాఁడ॥

గీ॥ సంగతులు సుప్రసిద్ధమై సత్యగుణకుటు
నెవ్వరేమనుకొన్న నాకేమికొఱఁత।
పెద్దపురిఁ గాళ్లకూర్వారి పిల్లవాఁడ।
ఘనత హనుమంతరావనఁ దనరువాఁడ॥

ఇట్లు బుధవిధేయుఁడు

10—3—14. | కాళ్లకూరి హనుమంతరావు.
ప్రస్తుతం కాకినాడ. | విచిత్రభారతము, పెద్దమ్మశతకము. etc. గ్రంథకర్త,
పెద్దాపురం.

